ప్రపంచముచెబ్బుతిన్నది. కన్నులులేనివాడు కారడవిలో సంచరించి నట్లయినది అదటుండనీ సరోజ పిల్లలవీడ్పు జబ్బుగమనించుట మహాకష్టము నేనుచెప్పిన వాటిలో ఏదైనదీ గమనించుట వకటి ఆహారవిహారాదులలో తనదోషము తాను గమనించుకొనుట మరొకటి పిల్లలు జబ్బుపడినప్పుడు తల్లి జిహ్వోవస్థా చాపల్యా ములమాని దయతో కాపాడుట ఇంకొకటి తల్లికర్తవ్యము తల్లిబాధ తల్లికే తెలియునుగాని ఇతరుల కేమెరుక అన్నట్లు తల్లిబాధ్యత గొప్పది సరోజ కనుగల్గి పోషింపవలె నన్నదామె.

అంతలో ఇంకొకాయమవచ్చి సరోజా మరొకవాడుక మానవులలో ఉన్నది మరీ పల్లెలలో పూర్తిఉన్నది. వారిమాటవినేవమ్మా తల్లిని శోకసముద్రములో ముంచుతారు. పిల్లను పరమపదింప చేస్తారు. ఏమంటావా కొందరు పిల్లలు తల్లికి కింకరులై చక్కగా నిద్రపోరు. ఎప్పుడూ ఏడుస్తూ వకరాత్రిలో పది పదహైదు సార్లు తల్లినిలేపి నానాఅవస్థలపెట్టుచూ ఉంటారు. ఇది తల్లిచేసిన పాపము తల్లి పాపము పిల్లపాపము కలిసినప్పుడు కంటినిదు వెల్లువలవుతాయి అప్పుడు తల్లి శాంతము భర్తసహకారము అత్తమామల దయ అగుపడేది. అట్లవీడ్పించకుండా ఏడ్వకుండా అవగింజలో అర్ధభాగం నల్లమందు చనుబాలలో కలిపివేస్తే తల్లికీ పిల్లకూ నిద్రబాగుంటుందంటారు. ఆనిద్రలో దీర్ఘనిద్రపోయినవారూ ఉన్నారు తల్లినిద్రకొరకై ఆకసిగంపరు మైకము గల్పించుట మహాపాపము లేతమెదడుకు మైకము గల్పించిన వారిఅవస్థ ఎట్లుండునో ఏమో దైవమునకెరుక వద్దు దీనిలోతు ఎంతా అని రౌరవాదినరక కూపములోకాలుపెట్టకు అది అకూపారము పారము ముట్టనిది అన్నదామె

అంతలో మరొకాయమ వచ్చి సరోజా పిల్లలకు గోళ్లుపెరుగనివ్వక అప్పు డప్పుడు తీయుచుండవలయును, కొందరు తమపండ్లతో కొరిగివేయుచుందురు ఇది చాలానీచము సన్నని కత్తెరలున్నవి దానితో చిన్నగా కత్తరించి వేయవలయును అట్లచేయకున్న కన్నులు పొడుచుకుందురు గీరుకొనుటలో రక్తమువచ్చును కన్నులు తగిలి పొరలు వచ్చినవారున్నారు. గోర్లను అప్పుడప్పుడు తీసివేయుట శ్రేయమన్నదామె

అంతలో వకయుక్తవయసు పిల్లవచ్చి మాయింట చేయునది నిత్యకృత్యము గా తప్పక కావలసినది ప్రతియింటా ఉండతగినది ప్రతిస్త్రీ చేసుకొనతగినది చెప్పుతా వ్రాసుకుంటావా అన్నది.

ఏమిటిదది చెప్పవే చూతాము అన్నది నవ్వుతూ సరోజ

మేము పల్లుపొడి పొట్లాలుచేసి అమ్ముతాము మాయింటిలో చాలాకాలము నుండి వాడుకున్నది ఈపల్లుపొడితో తోమిన చిగుళ్లవాపు చిగుళ్లనుండి పండ్లసందుల నుండి కారురక్తము చీము చిగుళ్లు క్రమేణా కొరుక్కుతిను జబ్బు నోటిదుర్గంధము బుడ్డలుకట్టుట పంటిసారలులేచుట పండ్లుపిప్పిపట్టుట నోటిపూతపొక్కుట నోట నీరుకారుట నాలుకపొక్కి మంటగానుండుట పోగొట్టును దంతములు ధావళ్యము గా నుండును పంటిజబ్బులు ఏవీరానివ్వక వజ్రకవచమై కాపాడుతుంది చెప్పుతా వ్రాసుకుంటావా మల్లినికుమారునికి కావద్దా అన్నది చిరునవ్వునవ్వుతూ.

సరే చెప్పమన్నది సరోజ.

—* పల్లుపొడి *—

ఉసిరికవలుపు 1 భాగం కరక్కాయవలుపు 1 భా, తాండ్రికాయవలుపు 1 భా, మాచికాయ 1 భా, జాజికాయ 1 భా, శొంటి $\frac{1}{2}$ భా, పిప్పలి $\frac{1}{2}$ భా, మిరియాలు $\frac{1}{4}$ నాల్గింటవకభా, ఏలకులు 1 భా, లవంగములు 1 భా, దాల్చిన చెక్క 1 భా, పచ్చకర్పూరం $\frac{1}{4}$ కాలుభా, వరిపొట్టు తెల్లబూడిద 16 భా.

## గమనిక.

కర్పూరము మినహా అన్నివస్తువులు దంచి వస్త్రగాలితముచేసి అటుపై పచ్చకర్పూరము కలిపిపెట్టి వరిపొట్టు వకగుంతలోగాని గోలములోగానిపోసి మధ్యలో అగ్నికణమువేసి కొంచెముగా గాలివచ్చుచోట పెట్టిన బాగుగాకాలిపోవు ను. ఆకాలినదానిలో నల్లగకొంత తెల్లగకొంత ఉండును తెల్లగున్నది మాత్రమే తీసుకొని వస్త్రగాలితముచేసి తీసుకొనవలయును వస్త్రగాలితమనగా వకగిన్నెకు పతలాటిగుడ్డ బాగాబిగించికట్టి ఈబూడిదెను గుడ్డపై కొంచెము కొంచెముగావేసి చేతరుద్దుచుండిన గిన్నెలోకి దిగుచుండును తూకపరికారము దీనిని తీసుకునేది ఈపల్లుపొడిలో నల్లతుమ్మచెక్కలోపలిభాగము నారవలె తెల్లగనున్న నారను ఎండబెట్టి పైతూకములలో వకభాగంగా కొందరు తీసుకొందురు మరీమంచిది ఈపల్లుపోడికి పదింట వకభాగం సున్నగానూరిన చక్కెర కొందరుకల్పుకొందురు నీవూకల్పుకో.

అక్కా ఈపల్లుపొడి చేసుకొన వల్లుబరువయిన నల్లతుమ్మ చెక్క బొగ్గ దంచి కొంచెముగా ఉప్పుచేర్చి పెట్టుకొనుట చాలామంచిది. బొగ్గుపొడి పండ్లకు కీడుచేయదు. పండ్లు తెలుపుగాను అవును అయితే కష్టభేదముండును నల్లతుమ్మకట్టె బొగ్గ శ్రేష్టము అనిమాయమ్మ అందరికీ చెప్పుతుంటుంది ఇదీ నాకు తెలిసినది అందరూ చెప్పుతుంటే నాకుతెలిసినది నేను చెప్పినాను ఇంతేఅక్కా అన్నది

ఆవేళనుంచీ ఎక్కడుండినావే వకటిచెప్పినా మంచిదిగాచెప్పినావు ప్రతిఇంటా ఉండతగినది ప్రతిస్త్రీ చేసిపెట్టతగినది బజారులో నానాయిటిక పొల్లు వరిపొట్టు బూడిదెలు కొనేదానికన్నా వకతూరి తయారుచేసుకున్న సంవత్సరముండును పొట్లాలుకట్టివేసినాసరే డబ్బీలోపెట్టుకున్నాసరే కాగితాలు చిత్తులుచేసి పోసిపెట్టుకున్నాసరే మంచిపనిఅని అందరన్నారు.

ఔను మానవత్వ మెత్తినందుకు ఉపకరించునవి నేర్చుకొని వుపకారము చేసినవారే మానవులు లోకానికి లోకులకు వుపకరించక పోయినవారు వుం ప్రయోజనమేమి అన్నదొకాయమ.

అంతలో జ్ఞానాంబవచ్చి ఏమమ్మా వగలంతా తలవాల్చలేదు లేవండీరేపు చూతము అంటూ అందరికీ పండుకొన వసతులు కల్పించినది.

రాము మగవారికి వసతులు ఏర్పరచినాడు అందరూపోయి సుఖంగ నిద్రపోయినారు.

మరునాడు రెండు వివాహములు సంతోషముగాముగించి ఎవరెవరి నివాస ములకు వారు పోయినారు.

రాగమ్మా అటుపైసరోజ గర్భమును ప్రాణమువలె నియమ బద్ధయై నవ మాసములు కాపాడి పున్నమ చంద్రుమించు కుమారుని కని అయిదవ మాసములో తల్లిగారి ఊరికివచ్చినది. అప్పుడు ఆమెనుచూచినేను ఏమమ్మా వంటచేసేది నేర్చుకున్నావా అన్నాను.

ఆమాటకు అతుక్కున్నట్లు శివప్రియ నవ్వుతూ వంటచేసేది నేర్చుకునే పండు వంటి కొడుకు చంకకువచ్చి వుండేది అన్నది

సరోజ ఆమాటకునవ్వుతూ నా అంచుకువచ్చి చెడిపోయిన కాపురాన్ని యుక్తియుక్తముగా సవరించి సాగనంపినావు వంటపండింది. పండినఫలం ఇదుగో అని బిడ్డను నాచేతికియిచ్చి మోకరించి నమస్కరించి కూర్చొమ్మని చీరా రవిక

తెచ్చి విధవనౌటచే చేతికిచ్చుటకు వీలులేక క్రిందపెట్టి తీసుకొమ్మని నమస్కరించినది

ఎందుకమ్మా యింతపని అని నూరేండ్లు బహుకుటుంబినివై పుత్రపౌత్రులతో సిరిసంపదలతో సుమంళివై బ్రతుకమని దీవించి నాను.

ఇంతపని ఎందుకంటావా జీవితమంతా చీకటిచేసుకొని అధోగతిపాలవు నన్ను మేలుకొల్పి తేజస్సునిచ్చి సాగనంపి సర్వసంపదలతో సర్వసౌఖ్యములతో సుఖపడచేసినందుకు నీవానాడు జ్యోతిని వెలిగించకున్న ఈవెలుగెక్కడిది అన్నది కుమారునిచూపి సరోజ.

నేనామెనుచూచి ప్రక్కన కూర్చుండబెట్టుకొని సరోజా ఆనాడు మేము మాట్లాడినమాటలు వెగటై ఈనాడు ఎంత రుచించినవోచూడు స్త్రీకి ఓర్పేముఖ్యము భర్తను సేవతో వలపుతో బంధించుకొని సుఖపడవలయును. భక్తిశ్రద్ధలతో భగవంతుని బంధించుకొని యిహపరములలో శ్రేయస్సును పొందవలయును. భర్తకడ వలపు పిలుపులు భక్తిశ్రద్ధలు సేవావినయములు లేకున్న సుఖమడుగంటును. భగవంతునియెడ భయభక్తిశ్రద్ధలు ఆచరణ విధానము లేకున్న యిహపరములు రెండూ ధూళిదూసరితములై పోగలవు తల్లీ భగవంతుడు తనభక్తవర్గములో తన్నుచేర్చుకొని తన ఇంటికి తానిచ్చు ఆతిథ్యము స్వీకరింప తప్పక నిత్యకృత్యముగ వచ్చుచు పోవుచుండునట్లు చేసుకున్న స్త్రీదే యిహమూ పరము మళ్లీవచ్చుజన్మము మూడందాల ముల్లోకాల దియ్యవలె వెలుగుతుంది. చుక్కల్లో చందురుడౌతుంది దేవ దానవమానవులలో దేదీప్యమానమై ప్రకాశిస్తుంది.

సీ॥ సంతతంబును కృష్ణ సంకీర్తనంబులు
వీనులకింపుగా వినగవలయు
హర్షంబు తోడుత హరినామ కథనంబు
పాటల నాటల బరగవలయు.
నారాయణుని దివ్యనామాక్షరంబులు
హృద్వీధి సతతంబు నెన్నవలయు.

కంజాక్షులీలలు కాంతారములనైన
భక్తియుక్తంబుగాబాడవలయు॥

తే॥ వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెరుగ వలయు
భేద మొనరింప వలవదు మేదినీశ॥

అన్నది భాగవతము దీనిననుసరించి షట్కర్మాచరణ ఉండిన వీగుసుపు తోసూ పనిఉండదు. అంతకు కావలసి వచ్చిన దైవమే తోడుచేయును.

ఇక భర్తయన్ననో డొక్కలో చిన్నపిల్లలు సుఖనిద్ర చెందినట్లు ప్రక్కలో నిద్రపోవలయును. నాభార్య ఎక్కడపోయినా అపకీర్తి తేదనియు తన్నువలచిన దనియు ధర్మబద్ధయనియు తనయశస్సునుకోరునది యనియు పేరు ప్రతిష్ఠల నిల్పుననియు లోకవ్యవహారములు చక్కగా తెలియును లోకువేదీలేదనియు నమ్మి నిమరించునట్లు చేసుకొనిన దాంపత్య సౌఖ్యమే సౌఖ్యము అస్త్రీదే కాపురము సరోజా చూడు పండువంటి పిల్లవాడు పండినాడు మగని దూరముచేసుకొని ఉండిన ఎట్లు వచ్చును. కాదని వచ్చిరిపో తండ్రిలేని పిల్లలై వారుసంఘమర్యాదలోగల్గు పరా భవములకు దుఃఖితులై తల్లినేమనలేక వారిపుట్టుకకువారు చింతించిన పాపము తలి నిచేరి వీడుజన్మలకు విధవత్వము వంధ్యత్వము సంప్రాప్తింపచేయును. మలమ్మల మాడ్పును స్త్రీకి తనసంతతి తనంతటివారై తనకు అండగానిల్చుకున్నంతవరకు యింటా బైటా దుర్బలత్వమే నన్నారు. ప్రథమములోనే కొడుకునే కన్నావు అందులో రాము నోటినుండీ ఊడిపడినట్లున్నాడు, పుట్టినింటికీ కాలుపెట్టినింటికీ కీర్తిగడించనున్నావు. గడించినావు. స్థాయిగా చిరస్థాయిగా హాయిగా కాలము గడుపుతల్లీ అన్నాను సంతోషపడింది ఇంటివారందరికీ సంతోషమయినది. ఆడబిడ్డ బాగా కీర్తిగౌరవాలతో బ్రతుకుతున్నదంటే తల్లి ఇంటివారికి అంతసంతోషమమ్మా.

రాగమ్మా ఆ అమ్మాయి మంచిపేరు ప్రతిష్ఠలతో ఇద్దరు కొడుకుల ఒక ఆడబిడ్డను కన్నది మంచిస్థితిలోనున్నది కొంతవరకూ పెద్దవారు పిల్లలకు చెప్ప

సముతోటి స్నేహితులు మంచివారు దొరకసముతోటి గురువు సహపాఠీలు బుద్ధిమంతులు బుద్ధిగరువు ధీమంతులు గావడముతోటి నడవడిక కొంతవరకుమారును పుంమజన్మ కర్మపెడ్డదయ్యే తలిదండ్రిలు అన్నతమ్ములు అక్కచెల్లెండ్రి బంధుమిత్రులు సహపాఠీలు గురువులు పెద్దవారుగా తడస్థింతురు ప్రతివాడు అభివృద్ధికిరాక పతనమగుటకు కారణము ఇదే. చూడు సరోజకు బాల్యమున తల్లి దండ్రి గురువు సహపాఠీలు మంచినడక నేర్పినందున కర్మ అవరించినను ఈ మంచి నడక వెంటనే మేలుకలిపినది. మొలుకున్నంతనే అది సహజరిచిమేలుచేసి అధోలోకమునుండి ఊర్ధ్వలోక పర్యంతం నిరాఘాటముగా పంపినది రాగమ్మా పిల్లల చిర్చుపదు:లో నున్నది కొంతవరకు మేలువినక పాడైపోవువారంటావా వారిజన్మ కర్మ అట్టివారికికూడా కొంతతో:ప్పడును అన్నది కరుణ.

రాగమ్మ కరుణ మాటలకు ఆశ్చర్యపడుతూ కరుణానీకు జ్ఞాపకశక్తి చెప్పగల వాక్చతురత భగవంతుడుబాగా పమకూర్చినాడు దన్యజీవివన్నది.

ఎక్కడికితల్లీ సర్వము భగవల్లీల నాయట్టికష్టజీవి మఱొక్కరుండ రనుకుం టాను సర్వకష్టములుపడి వీరినాశ్రయించి స్థిరప్రజ్ఞతో నిలుచుకొని ఉన్నాను. కడకా పరమేశ్వరుడేమి చేయగలడో సర్వము వానియిష్టమని గడ్డిని గంపకు పెట్టుచుండగా,

ఏమింకచాలునా అన్నది రాగమ్మ.

ఔనుతల్లి సంజవేళఆయినది పోదాము సంధ్యావిధి ఉన్నదికదా అన్నది కరుణ.

సరేనని రాగమ్మ యింటిలోకి పోయినది వింటూఉన్న పెండ్లివారు పెండ్లియింటికి పోయినారు కరుణగడ్డిగంప ఎత్తుకొని అవ్వల ఇంటిలోకి పోయినది.

రాగమ్మయింట ప్రవేశించి చూచుసరికి కమల త్రిదేవీ సహస్రనామములు రెండు అంచుననుంచుకొని లక్ష్మీసహస్రనామములు చెప్పుచుండెను. శాంతమ్మ సహస్రనామము చెప్పుకుంటూ కార్యములు చేయుచుండెను.

అంతలో కరుణ కాళ్లూచేతులు కడుగుకొని వచ్చి దేవునికి నమస్కరించి కూర్చొని రాగతాళి యుక్తముగా దైవధ్యానముచేయ ప్రారంభించెను.

రాగమ్మవారి ఆచరణ విధులచూచి ఆనందపడుతూ రాత్రికి మరింతకదిపి వినతగినవి వినవలెనని యువ్విళ్లూరుతూ కరుణ గట్టిగ చెప్పు నాపాడుచెవులతో నేనూ వింటానన్నది.

కరుణా కములా కలిసి స్వరములుకలిపి చెప్పనారంభించినారు.




శ్రీ దుర్గా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.